# యీ పుస్తకాన్ని గురించి మరి కొన్ని మాటలు

ఆదిమ మానవుడి గురించి చెప్పిన కథను మీరు యిప్పుడు చదివారు.

యీ పుస్తకం మొదలుపెట్టే ముందు మేం చాలా పుస్తకాలు చదివాం.

భూమిమీద మానవ ఆవిర్భావం జరిగేదాకా సకల ప్రాణులూ యెలా మారుతూ, పరిణామం చెందుతూ వున్నాయో ఛార్లెస్ డార్విన్ నుంచీ, ఆయన అనుయాయులు వ్లదీమిర్ కొవలేవ్‌స్కీ, క్లెమెన్త్ తిమిర్యాజెవ్‌నుంచీ తెలుసుకున్నాం.

శ్రమ వానరుణ్ణి నరునిగా మార్చిందని ఫ్రెడరిక్ ఎంగెల్స్ పుస్తకాలనుంచి తెలుసుకున్నాం.

ఆదిమ మానవుడు ఆలోచించడం, మాట్లాడ్డం యెలా నేర్చుకున్నదీ అర్థం చేసుకోవడానికి ఇవాన్ పావ్‌లొవ్ సహాయం చేశాడు.

వేల సంవత్సరాల కాలంలో మానవ సమాజాభివృద్ధి మహత్తర ద్వారాలు మన ముందు కార్ల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్, వి. ఐ. లెనిన్‌ల రచనలు తెరిచాయి.

ప్రకృతిశాస్త్రజ్ఞులు రాసినవీ, చరిత్రకారులు రాసినవీ, పరిశోధకులు రాసినవీ యింకా చాలా పుస్తకాలు చదివాం.

మానవ జాతి చరిత్ర గురించి యెక్కువ తెలుసుకోవాలనుకుంటే మేము చేసినట్టే చెయ్యండి: విజ్ఞానశాస్త్రపు ప్రాథమిక ఆధారాలైన పుస్తకాలు చదవండి. యీ భూమి గురించీ, మానవ జాతి అభివృద్ధి గురించీ అధ్యయనం చేసిన శాస్త్రజ్ఞుల పుస్తకాలని చదవండి.

మిమ్మల్ని విజ్ఞాన శాస్త్రపు సింహద్వారం దగ్గరికి తీసుకొచ్చి అక్కడ వదిలిపెట్టి, యిలా అనడమే మా లక్ష్యం: ''ప్రవేశించండి.''

పాఠకులకు మనవి

ఈ పుస్తకం గురించి, దీని అనువాదం గురించీ మీ
అభిప్రాయాలను "రాదుగ" ప్రచురణాలయానికి దయచేసి తెలుపండి.
మీ అభిప్రాయాలను ఈకింది చిరునామాకు పంపండి:

Raduga Publishers
17, Zubovsky Boulevard
Moscow, USSR

